# చింతామణీ

శా॥ శ్రీమాతాత్రిపురాగిరీశతనుజాశ్రీమత్సుధాపూరితా
శ్రీమంత్రార్థసురూపిణీగిరనుతాశ్రీశైలలింగార్థదే
హ-మీనాక్షీసుహ-సినీగణపతేరానందకందాయినీ
త్వామాంపాతుతమోవినాశినిసదాతత్వార్థచింతామణీ॥ 1

శా॥ శ్రీమత్కాంచనశృంగమధ్యనిలయాశ్రేయస్కరీశ్రీకరీ
వామాంగీ సకలార్థదాయిని సతీవాగీశ్వరీ వైఖరీ
సోమార్కాద్యుతిలోచనీ శివపరా స్తోత్రప్రియా శోభనా
శ్యామా యిమ్మికనోసదర్థపథమున్సద్భక్తచింతామణీ॥ 2

శా॥ శ్రీకల్యాణసువర్ణచిహ్నానిధిగౌరీనీపదంబౌసదా
శ్రీకైవల్యమునీయనీవెసరినీరేజాతపత్రేక్షణా
సాకల్యంబగునీజగత్తు యదినీస్వాధీనమైయున్నదే
మాకున్మంగళయోసధర్మపథమిమ్మాభక్తచింతామణీ॥ 3

శా॥ దాసోహమ్మనియంటి దేవి గిరిజా దాక్షాయణీ శాంకరీ
రాసీభూత సమస్త విశ్వమును నీరక్షా సుఛత్రాంచితా
వాసమ్మన్చు సదా సుధా సుకరుణావర్షాంబుధీ స్నానమున్
ప్రాసాదమ్ముగనీయుమమ్మ లలితా ప్రాక్పుణ్యచింతామణీ॥ 4

మ॥ సకలోద్ధారిణి పార్వతీ గిరిజ మా శ్యామాయుమా శాంభవీ
యకలంకౌషధ మంత్రరాజమది యిమ్మానాకు శాకంబరీ

సకలాధార విచిత్రఛాయ ససుధీసారా సుధాపూరితా
సకలాభీష్టవరంబునీజనముకున్సద్భక్తచింతామణీ॥ 5

శా॥ తల్లీనీదు సువర్ణవర్ణ పదమందారాల రాగాంబుధిన్
ముల్లోకంబులు ముస్కవేయనల ప్రాముఖ్యంబుగల్పించినీ
వుల్లాసంబున సృష్టిసల్పి మకరందోత్పాదనారణ్యప్రాం
సుల్లీలా సుమవల్లిబంధన శరజ్యోత్స్నారసాప్లావనల్
సల్లీలన్కలగంగజేతువికనో సద్భక్తచింతామణీ॥ 6

శా॥ వాణీనీ పదమంజుల ధ్వనిమదావాసాగ్రపీఠంబుపై
పాణిన్జేరగదీసినాలో ప్రతిభాప్రాక్చార ధీశక్తి శ
ర్వాణీవాగ్ఝరినింపి శబ్దము సువర్ణాలంకృతావాలమౌ
బాణిన్ఛందమునందునిల్పుమికనోప్రాకామ్య చింతామణీ ॥ 7

మ॥ కమనీయంబగు నీదు నామమది సాకల్యంపు కళ్యాణమౌ
సుమశోభారతిపొందగా సతమునాశూలిన్ శివున్శంకరు
న్సమభాగంబును పొందియున్న నినునాశాపాశముల్వీడగా
న్యమరాధీశులె సేవసేయుదురహో సద్భక్తచింతామణీ॥ 8

మ॥ రమణీయంబగు నీదునామ జప సారాంశంబెరింగెవ్వరే
న్యమలంబౌహృదిచింతజేయునల పాపంబంతనాశంబుగా
నమలంబౌ జననంబునొంది యిలనార్యాపాద సంసేవనా
సమధీరుండయి ఖ్యాతిగాంచుగద। యోసద్భక్తచింతామణీ॥ 9

మ॥ చదువున్రాదు మరేమి చింతనమునేచర్యన్గొనన్గాక నే
యదునున్గానగలేను జ్ఞానమును దెల్యంగానశక్తుండ మా
కెదురౌయాపద తట్టుకో బలములేకే నిన్నుపిల్వంగ యా

పదలేకోశమునందులేవుమరి యోపాంకామ్య చింతామణీ॥ 10

మ॥ అమరుల్నిన్నిరతంబు సేవనలచే సంతృప్తి పర్చంగ నీ
వమరాధీశు మురారి బ్రహ్మనిల యావైశ్వానరుండాదులన్
సమరాడూపము దాల్చియందెదరి వాక్సంపత్తి నాలించి వే
యమరారిన్యనిద్రుంచి గాచితట। ఓసద్భక్తచింతామణీ॥ 11

మ॥ హృదయాహ్లాదము నీదుసచ్చరితవ్యాహృత్తమ్మునన్మాకు దా
ముదయించున్గద విద్యలన్నిమదితాముత్సాహమున్బొంద్యప
ప్రదనామంబులవేవియున్ దరికిరాబద్ధించి చూడంగ భీ
తిదగుల్కోమది నిచ్ఛగించవు । సుధాత్రీ భక్తచింతామణీ॥ 12

శా॥ అమ్మావాక్కులనీయుమమ్మ మనమందాలింపరావమ్మ చే
కొమ్మాభక్తులపాపముల్దయయుచేకూరంగనో శాంభవీ
లెమ్మామాకు సుబుద్ధినీయకరుణన్లేరెవ్వరున్జూడగా
సమ్మానింపుమునీదయాగుణముచేసద్భక్తచింతామణీ॥ 13

శా॥ నీయాశీర్వచనంబులేక ధరణిన్నిల్వంగనెట్లౌనుమా
యేయేకార్యములేలకావలయునో యెట్లుండగామంటివో
యాయాశక్తులనాకుయిమ్ము భువిలో మర్యాదనిప్పించుచు
న్నాయాసంబునులేని జీవనమునీ సద్భక్తచింతామణీ॥ 14

శా॥ కైవల్యంబునుగోరి నిన్ను మదినేకాకారిగాదల్తు జ్యో
త్స్నావాగీశ్వరి వాక్కులన్ నిలువవే శర్వాణి కాళీ రమా
యావాసంబదియెచ్చటో విమలసామాద్యాదితేజోంశమా
సౌవర్ణాంబరధారిణీ సులలితాసద్భక్తచింతామణీ॥ 15

శా॥ ~~ఈ~~లోకంబున జీవితంబు గడువన్యిమ్మాధనంబుల౹మా
యాలోకంబున సౌఖ్యసంపదలతో యాశిస్సులన్ పార్వతీ
సాలోక్యంపురసానుభూతికరుణాసారూప్య సాయుజ్యము
న్నాలించమ్మమమున్మనమ్మునిడియోసద్భక్తచింతామణీ॥ 16

శా॥ ఇమ్మాయాజగమందు జీవనము సంక్లిష్టమ్ముగానున్నదే
యమ్మాయిమ్ముధనంబులక్ష సలుపన్సత్కార్యమున్దానమున్
యిమ్మేనున్నది నీపదాబ్జములు సేవించేందుకేయందు నా
కిమ్మాసక్తిని నీదు భక్తి నికముక్తిన్బొంద చింతామణీ॥ 17

శా॥ నీపూజావిధినాకురాదు ధనమానీభక్తియేనమ్మరో
యేపూలన్నినుపూజసేయగలవాడేనంచు భావిచెద
న్నాపూర్వంపుఫలంబుచేనిరతమానందమ్మునందించగా
సాఫల్యంబగువిద్యనిమ్మునికనోసద్భక్తచింతామణీ॥ 18

శా॥ ఏరారమ్మనిబిల్చినన్నుమనసాక్షేమంబుయోజించియో
పారావారగభీరముద౹సుమసౌభాగ్యంపుసౌందర్యవా
గ్ధారాపాతకవిత్వసంపదలసద్గంగాంబువోలెన్సదా
చారాచారుడునన్నుదీవెనలనీ సద్భక్తచింతామణీ॥ 19

శా॥ ఆకాశంబుననుండి శంభునిపదాబ్జంబుల్ముడిన్వీడియా
లోకానందముయూడిశూన్యమునయాయుయ్యాలలూగెంతయో
శోకానమ్మనిగీభువిన్మలినహ-సోదంతమౌజీవియై
యాకాలున్భలపాశమున్దగిలి ఆయాసాన పొర్లంగ నీ
వే కారుణ్యము లేకనన్ను దరిరానీవేలచింతామణీ॥ 20

శా॥ మంత౹ంబున్నెరుగంగరాదుమనసా మాన్యతనొందంగయే

తంత్రజ్ఞానములేనివాడమదిలోతత్త్వార్థభావంబునే
మంత్రోపాసనచేతనొందగలనమ్మాయియ్యవేజ్ఞానమో
మంత్రాధీశ్వరిమల్లికార్జునసతీమాంపాహిచింతామణీ॥ 21

శా॥ నీవాశాసనమీయకున్ననసురానీకంపుసంతానమే
సావాసానమనుష్యులందరినివాసంబైనయాభూమివా
రావాసంబుగమార్చిమానవులపోరాటాలజీవాలుగా
కావాలన్నునుచేతురేమొనికనోకామ్యార్థచింతామణీ॥ 22

శా॥ నానాయోనులజన్మమొందిచివరీనాడిట్లుయిాజన్మలో
కానీమార్గముగాంచినానుగద!సాక్షాత్కారమొందిచ్చటన్
యేనీమంబులులేకనీదుచరణంబేనాకుయిప్పించితే
స్థానాస్థానవిచారధీరమతి వోసద్భక్త చింతామణీ॥ 23

శా॥ నీవీజ్ఞానమునీయకున్ననికనేనీమంబుపాటింతునో
కావాలన్ననుపొందగల్గుదునె?నీకారుణ్యహర్షాంకము
న్సేవాభాగ్యముగల్గజేసిపరమాశీర్వాదమిమ్మీశ్వరీ
నీవాల్లభ్యముచేతసత్ఫలమగోనిత్యార్థచింతామణీ॥ 24

శా॥ అంతర్ధ్వాంతముదూరమౌస్వకులమానందమ్ము పొందించనౌ
స్వాంతబందుసుఖంబునొందగరసాస్వాదంపుజీవంబునౌ
ప్రాంతాప్రాంతవివేకవిద్యఫలమౌప్రాణంబునౌపుణ్యమౌ
శాంతావాసము నీపదాబ్జమగుగా సద్భక్తచింతామణీ ॥ 25

శా॥ తల్లీనీపదపూజసర్వఫలమంత్రమ్మన్చుభావించెదన్
కల్లోలంబగుజీవితార్ణవపుచుక్కానైసదాబోవవే
విల్లంబయ్యెదురాభిమానులకునావృత్తంబులౌజన్మల

న్సల్లీలన్కలగన్గ జేతువె సదా సద్భక్తచింతామణీ॥ 26

శా॥ సంపాద్యంబుచరాచరంబువిమలాచారంబుసంసారము
న్దాంపత్యార్థముసంతతౌజగతి తాదాత్మ్యంపుభావంబుచే
సంపద్వర్తనమౌసదామనము!యాసౌమ్యార్థసంపర్కము
న్సంపత్కార్యముగాదె?భక్తులకునోసద్భక్తచింతామణీ॥ 27

శా॥ ఈదేహమ్మునునద్దెకొంపయనినేనెగ్గంగనాలస్యమై
నాదారేదనుచున్సదామనము ఁనానాయోచనల్జేసినీ
యాదర్శాశయసంవిధానముసునాయాసంగునంచెంచితే
సదాదేశమునిస్తుమార్గమదినీ సద్భక్తచింతావణీ॥ 28

మ॥ ఇలసప్తార్ణములేడువర్ణములు వాగ్వ్యాలాదికార్యంబులు
న్కలలేగాదయతోపదార్థముల్నేకార్యార్థివైసృష్టిజే
సిలమామాసుఖసంతసమ్ములనుయాసిన్నీవుకాపాడుదో
కలలోనైననుమర్వనమ్మనినుసత్కామ్యార్థచింతామణీ॥ 29

మ॥ అవమానంబునుభరింపలేను సమభావంబేమిలేదిచ్చట
న్నవలునే౹లునుదల్తునీపదముశాపాలన్ని నాశంబుజే
యవె గర్వాంధులపీచమణ్చగను మాయాజాలముల్జీల్చవే
యవినాశాపరమేశ్వరాశ౹యనిధీసద్భక్తచింతామణీ॥ 30

శా॥ నీయాజ్ఞాపదవర్తినయ్యిధర నేనీమంబుతోనుండి యీ
మాయాజాలముజీల్చగాపిలుతునోమాహేశ్వరీధీనిధీ
కాయమ్మందుననున్ననాళ్ళుతవసాక్షాత్కారమిప్పించవే
గాయత్రీ౹జపమంత౹సారఫలమార్గా భక్తచింతామణీ॥ 31

శా॥ అమ్మానీకనుపాపలందుగననీనాబింబమున్నవ్వుచు
న్నీమ్మాసక్తినిధైర్యమీశ్వరిదయాపీయూషభాగ్యమ్ముసా
యమ్మైమ్మిదివ్యపదాబ్జసేవపథమాయాసంబులేకుండగా
రమ్మామార్గముచూపినడ్పగనుయోరమ్యార్థచింతామణీ॥ 32

శా॥ ప్రాణాధారమునీకృపామహిత సోపానాంశమార్గంబులో
వీణాపాణిదయాసమన్వితముకావేయీపదార్థంబులా
స్థాణున్బాలగణాధిరాజులవిలాసార్థంబు(గల్పించితీ
ప్రాణుల్నన్నిటిన్సదాశివమనమాప్రాక్పుణ్యచింతామణీ॥ 33

శా॥ నేనేమిత్తునునీకుతల్లిశుభవర్ణీయాంశపుష్పంబులా
యీనేలందుఫలించురమ్యఫలమా!యేదీకనన్గాక నే
పోనీపీయుషధారపక్వరుచిపుష్పోపాంశమా మాకులే
దేనీవేకనుమోదయార్ద్రనిలయాదివ్యార్థచింతామణీ॥ 34

శా॥ భాషావైభవవర్ణచిత్రపదసౌభాగ్యాంశసంధాయినీ
కాషాయాంబరమార్గదాయివిమలాకామ్యార్థవాగర్థధీ
భూషాలంకృతఖేచరీగకిరణాభూతాత్మసంస్కారిణీ
భాషించీవభయమ్మునీయుమికనోభావార్థచింతామణీ॥ 35

శా॥ దారాపుత్రులుతల్లిదండ్రిపలుబంధాలన్విచారించగా
నారాధ్యుండనుగౌరవంబుచదువున్బట్టోకులీనత్వమో
యారాధించుటజర్గునీభువినియాయాసంబుదేహ-నికే
యారాటమ్మదిమాన్పిమార్గమది యిమ్మాభక్తచింతామణీ॥ 36

శా॥ కారాగారముబోలుదేహమున యింకాయెంతకాలంబునీ
పేరాశాజలధందుముంచుటసతీ పేర్మిన్విచారించియీ

పారావారసమంబుబ్రతుకునోభారంబయ్యేదాటించవే
సారాసార విచార ధీర సరసా సద్భక్తచింతామణీ॥ 37

మ॥ ప్రతిజన్మంబునతల్లిదండ్రులగునీప్రాక్పుణ్య బంధంబునన్
ప్రతిజీవీమహిపొందియుండుగదయాప్రారబ్ధసంబంధము
న్మతినూహింపగనెంతకాలమనియీమాయాజగంబందున
న్గతినీవేయనికొల్చువారలకుయోగంబీవెచింతామణీ॥ 38

శా॥ రాకళ్యాణి యుమాశివాని గిరిజా రాభ్రామరీచండికా
రాకామ్యార్థవిధాయినీ విమలవీరారాధ్యసంతారిణీ
రాకారుణ్యరసాప్రమోదిని యపర్ణా రాగణారాధితా
సాకల్యాంశినిరాగదమ్మనిటకోసద్భక్తచింతామణీ ॥ 39

శా॥ రాకౌమారిమహేశ్వరీవిరజరారాజేశ్వరీరంజనీ
రాకామాక్షికళావిలాసినిహరీంద్రాద్యాదిసంసేవితా
రాకామేశ్వరిరాప్రసన్నహృదయారాయోగసంస్కారిణీ
రాకాచంద్రముఖీసుధారసధునీరమ్యార్థచింతామణీ॥ 40

శా॥ రావమ్మాహిమజా గణేశజననీరాస్నిగ్ధసౌందర్యమా
రావాగీశ్వరిచిన్మయీరసమయీరామంగళాలంకృతా
రావీణాధరిసంయమీసకలసామ్రాజ్యాధినేతా సతీ
రావేప్రాగ్భవపుణ్యవైభవసుధా రక్షీయ చింతామణీ॥ 41

శా॥ ఛందోజ్ఞానములేనివాడపలువాచ్యార్థాలశూన్యుండ నే
బంధాలన్బడిజన్మసంసృతిన సద్బంధాలుగాతల్చితిన్
సందర్భానుసరోక్తిరిక్తుడరిసంస్కారాంశహీనుండ వా
క్సంధాయీసకలార్థమీయుమికనోసద్భక్తచింతామణీ॥ 42

శా॥ వాగర్థంబులబంధమెట్లొయటులేవ్యాగ్రాన్బరున్నిక్తివీ
వేగాదా నగజాగజాననహృదావేశాప్రమోదాయినీ
త్యాగాసక్త సదాహృదీవిమల వాత్సల్యార్థసంసారిణీ
యోగాసక్తినిభిక్షగిమ్మడిగితిన్యోభక్తచింతామణీ॥ 43

శా॥ భోగాడంబరుడైనగానిధనమాపోసంబుపట్టంగనీ
రాగాలాపనచేయనీమనమురారాపుల్పడన్దేహికా
రాగారంబునయుండనీహృదయమారాధించనీపోవనీ
సాగన్నేరవుపొందుకర్మఫలమున్సద్భక్తచింతామణీ॥ 44

శా॥ యోగానందఖనీయజాయమరవాగ్జ్యోతిష్మతీ సన్మతీ
యోగాయోగపదార్థవిజ్ఞఫలదాయోధ్యాణపీఠస్థితా
యేగీతమ్ములునాలపింపగలనే?నీమంబుపాటించనే
రోగఘ్నీవనితల్లిమొక్కెదసదాయోభక్తచింతామణీ॥ 45

మ॥ క్షణమోఘుంటయెరోజొమాసమగొయెుక్కారోమరేడాదియో
గణనేలాబుణమున్నకాలమిట భోగంబో సదారిద్ర్యమో
ఫణమెంతోమరియంతపొందిలనురాపొడంగజన్మించి యీ
షణముయ్యంబుధిమున్గగావలెనెలా?సద్భక్త చింతామణీ॥ 46

మ॥ ధరకౌండిన్యునిగోత్రసంభవునిగాతన్వందికాలానుసా
రరమావైభవచిన్మయాంశములపారంబెర్గిపితృణాము
న్ధరనున్నీసమయంబునన్దగిలియీదారిద్ర్యబాంధవ్యము
ల్భరణంబొందితినేకర్మఫలమోబాపిష్టు చింతామణీ ॥ 47

శా॥ విద్యావిద్యలమార్గశూన్యుడను యోవిద్యా! తమాశిస్సులే

సద్యోజ్ఞానఫలంబునిచ్చునని విశ్వాసంబుతోనుంటినే
విద్యుల్లీల లతాసహేల లలనా వీరాసనా వీర్యదా
సద్యస్ఫూర్తితొసద్గతిమ్ముగిరిజాసద్భక్తచింతామణీ॥ 48

మ॥ ఋణమోక్షావ్రణవైద్యదాపరమ సంతృప్తాపరాపాహిమాం
రణధీరారజనీశకాంతిలతికారాకేందుబింబాననా
గణనేతా భవతాపహ-రితరుణీగాంధర్వగానప్రియా
యణిమాద్యాదిఫలంబునీకరుణయేసద్భక్తచింతామణీ॥ 49

శా॥ ఆశాపాశముద్రుంచియేషణమయీసంద్రమ్ముదాటించినీ
యాశీర్వాదమునిచ్చి జన్మరహితంబౌస్థానమున్గూర్చుయి
చ్ఛాశక్తీవనికొల్తుశర్వునిపదాబ్జాలందుమంజీరమై
యాశాశాసనమిచ్చునాదమయవాగ్యోగాంశమైయుందునా
యాశల్తీర్చుముశైలజాసమరసాసద్భక్తచింతామణీ ॥ 50

శా॥ భోక్తల్భోగముభోగ్యమన్నియునునీభూరర్థవిజ్ఞానమే
వ్యక్తావ్యక్తపదార్థవిజ్ఞతలునీవ్యాహృత్యవ్యాఖ్యానమే
సక్తాసక్తవిశేషకార్యములునీస్వాంతాంశనిర్ధారణే
భక్తాభీష్టవరప్రదా సకలదా భావార్థచింతామణీ 51

శా॥ వందేవాగ్భవబీజరూపిణిసదావాగీశవిద్యానిధీ
ఛందోజ్ఞానవిశేషశబ్దనిగమాసప్తస్వరోత్పాదినీ
మందజ్ఞానవినాశినీయమలినీమంత్రాక్షరీమంత్రిణీ
సందేశమ్ముదియిమ్ముమవాణి మదిలో సద్భక్తచింతామణీ॥ 52

మ॥ పశుపక్షాదులభావజాలములశబ్దాలాపనంబిచ్చియా
పశుపక్ష్యాదులభాషనేర్పరిచితేభావానుకూలంబుగా

దిశనిర్దేశముచేతువీస్ఫృతినినీదివ్యాద్భుతోద్భాషణన్
విశదమ్మయ్యెనునీదులీలలవియోవిజ్ఞానచింతామణీ॥ 53

శా॥ ఆనందమ్మదికల్గజేయగనువీణావేణువాద్యధ్వను
ల్గానంబుల్వలునాట్యరీతులను యాగాంధర్వవిజ్ఞానము
న్నానందమ్ముగనిచ్చితోసకలభాషాజ్ఞాన వేదార్థముల్
యానందాద్భుతమార్గమిమ్ముయికనోసద్భక్తచింతామణీ 54

శా॥ తిర్యక్జంతుజడంబులన్నిసమభాతిన్గాంతువీవెప్డునీ
కార్యమ్మందునలేదుభేదమసలేకాలంబునేకాని యీ
పర్యాలోచనసేయలేరెవరుయాపద్బాంధవీవౌట చేన్
హర్యక్షాసనిహర్షిణీహరసఖీయాహ్లాదచింతామణీ 55

మ॥ అవమానంబునుమానమున్సమముగాభావించిజీవించనెం
చవలన్దెప్పుడునీదుభక్తిమతులన్చర్చించవింటీవిధిన్
బవలునేలునునిన్నుతల్చుకొన నీబాధంతమానందు యీ
రవిచన్ద్రాదులె సాక్షులౌనిట విచారంబేల చింతామణీ ॥ 56

శా॥ ఐశ్వర్యంబునుయిచ్చినావుమదివాగైశ్వర్యమిప్పించుమా
శశ్వద్భాసితవిద్యనిమ్మిపుడుయీస్వాంతంబునందెప్పుడున్
విశ్వాధిక్యత నీదిగాన విధినీయిచ్చోను వీణాధరీ
విశ్వాత్మావిమలావిశ్వమాతవివిదావిద్యార్థ చింతామణీ ॥ 57

శా॥ బాంధవ్యమ్మదిజూడదేహమునకౌభావమ్మునాత్మాంశమౌ
గంధాదుల్వలుపూజితాంశములుయీకాయంబునొందెప్డయే
సంధర్భంబునుగాంచినన్మనసునన్శాంతేడగాన్పించదే
బంధాల్బాపుచునాత్మ నిర్మలత కాపాడమ్మ చింతామణీ॥ 58

శా॥  విద్యల్యైన్నవియున్నవోకనగ నోవిజ్ఞానుడేడీ ధరన్
సద్యస్ఫూర్తిని కల్గజేసి సకలాభీష్టమ్మిచ్చు సద్విద్యనీ
యాద్యమ్మీవెగదాక్రియావిధెరుగోవాగ్విజ్ఞతిమ్మాయుమా
సద్యోమంథజమానసీసకలదాసద్భక్త చింతామణీ॥ 59

శా॥ ఉచ్ఛ్రుల్నీచులసేవలందెదవుయేయుత్కర్షముల్లేదునీ
యిచ్ఛన్నడ్చునువిశ్వమంతయునుయేనీచస్థితందుండనీ
స్వచ్ఛస్వేచ్ఛగగొల్వనీకృపకలుగున్సామ్యమ్ముమ్మనీదౌటచే
యిచ్ఛాశక్తివినీవుతల్లివరమందించిప్డు  చింతామణీ॥ 60

శా॥ వేదబ్రాహ్మడుగానిపేదయవనీవెయ్యేలభేదంబును
న్లేదేడన్కననీదుచూపునసదానీచుండుగానిమ్ము నీ
మాదుల్గల్గినవారుయైననుమరేమాతంగుడైనన్కన
న్నీదారిన్గనగాపరీక్షసలుపన్నిత్యార్థ చింతామణీ॥ 61

శా॥ ఘనమౌపూజలుసేయనేల యిలనీకాయంబునన్జీవిగా
మనుచెన్నాళ్ళిటయుందురోతలువనీమార్గమ్ముదర్శించగా
మననవ్యాపకమింతవిద్యవలదిమ్మాయాంతమవ్వన్సదా
మననంబేమనమందుమంత్రమయినీమంబిచ్చు చింతామణీ॥ 62

శా॥ ఈదేహమ్మునయున్ననాళ్ళుయిదినాదేనంచునేనంచునీ
దేదీయంచుసదాగర్వమొందుచునువాదించున్కదామూర్ఖతన్
యీదేహమ్మునువిద్యనాదియనునే?నేనందురే?కానగన్
యీదేహమ్మదిమిథ్య!సత్యమాత్మయగు నిర్ధారింప చింతామణీ॥ 63

శా॥ గాయత్రీవయిమూడుసంధ్యలజనాకాంక్షల్నితీర్తెప్డయా

మాయాతీతవునైసదాజనులకామ్యంబిచ్చిరక్షింతువే
సాయమ్మయ్యిమునీశ్వరాదులకుయోసాధ్యాంశమౌదంతటన్
నీయాజ్ఞేయిలసర్వజీవులసదానిర్మించు చింతామణీ॥ 64

శా॥ నేనన్నన్యదిదేహమేలయగునో? నేనన్నజీవమ్మగో
మేనన్నుండుచునిద్రపోవమదికామేచ్ఛేమిపోదెందుకో
నేనన్నన్మరియాత్మయన్ననిటనోనిత్యాంశమౌకదా
నేనెవ్వాడనుతెల్పితల్లితెలివిన్నిమ్మంటి చింతామణీ॥ 65

మ॥ కవితాదాత్మ్యతచెందువస్తువుననోకావ్యమ్మురాయంగయా
కవి తాన్ప్రాకృతజీవమిడ్చి కవనంగావించునాకాలమున్
బవరంబందునసైనికున్వలెనుతా ఛావించుకావ్యక్రియన్
యవివేకేలదినెర్గనమ్మయిలలోయన్వర్థ చింతామణీ॥ 66

శా॥ మంత్రార్థమ్మెరుగంగ కావలయునిర్మాణాత్మసౌశీల్యుడై
మంత్రధ్యానవిశారదుండయినధర్మాత్ముండుబోధించినా
మంత్రారాధ్యతదెల్పిశిష్యులకుసన్మంత్రమ్మునీయంగనో
మంత్రాధీశ్వరిమంజుభాషిణిసదామాంపాహి చింతామణీ॥ 67

శా॥ ~~ఈ~~జన్మాంతరయోగభోగములయేయేజన్మలన్పొందితో
యాజన్మమ్మునయుండుదేహములయాయాబుద్ధియెట్లుండెనో
సాజమ్మౌయనుమానమొందితినియీజాలమ్ముచీల్చివునా
పూజల్గొన్చికనీదుసన్నిధిననాబుద్ధిన్నిల్పు చింతామణీ॥ 68

శా॥ సర్వశ్రేష్ఠవునైననీదుపదకాసారాబ్జమధ్యంబున
న్సర్వంబున్గలదన్యుపాసనమునన్సర్వార్పితంబన్చుతా
గర్వంబీడుచునున్నయాగృహమమోఘంబైనలక్ష్మీస్థలౌ

సర్వేశానిసదాసలక్ష్యవరదా సద్భక్త చింతామణీ ॥ 69

శా॥ మాయామేయజగంబునిత్యమనిసమ్మానించియీదేహము
న్నాయాపద్ధతులందుపోషణలచేన్సాగించునీమోహితు
ల్సాయమ్మేదియురాదుచావుదరిరాసాగింతురే?జీవులై
నీయాజ్ఞాపథమందు నడ్చెదము మన్నించమ్మ చింతామణీ॥ 70

మ॥ ధనమేనిత్యమనెంచుదుష్టులకుబాంధవ్యమ్ములేదేమియున్
మనమందింతయుబాధయుండదదిసామాన్యంబువార్కెప్డుచూ
డనునిత్యమ్మనధర్మమార్గమునమాటాడున్కిరాతుల్వలెన్
మనసా నీపద సేవ మాన నుమ నన్మన్నించు చింతామణీ॥ 71

శా॥ ఏరూపంబుననిన్నుగొల్వవలెసర్వేశాని మాతాసదా
నీరూపున్కనినానుమాతృమమతేనీవన్పువిశ్వంబునన్
వారున్వీరనిలేదుసర్వమునునీవాత్సల్యతేయున్నదే
పారావారసమంబునీమనసు యంబా యర్థిచింతామణీ॥ 72

శా॥ సంసారార్ణవయానసాధనమునీసాంగత్యమ్మనేనమ్మి నే
సంసారమ్మునయుండినీదుపథమేశాంతస్థలంబంచుయీ
సంసారార్థమునుద్యమించితినియోసర్వార్థసంపత్కరీ
హింసాశాసని హేమవర్ధిని యోహ్రీంమంత్రచింతామణీ॥ 73

మ॥ నవరంధ్రాత్మకమౌశరీరమునుయోనాకమ్మనెంచిచ్చుట
న్నవసానాంతముమోహవార్ధిమునిగాయాసంపు యానంబుచే
బవలునేఁలునుసౌఖ్యమజ్జనముసంభావింతు నీమార్గము
న్నవలోకించరు తల్లి!రక్షనిడుమా నానార్థచింతామణీ॥ 74

మ॥ శుభమౌదృశ్యముచూడనిమ్ము ఘనమౌశోధించుశక్తిమ్ము నీ
సభలోనుండగచోటునిమ్ము మనమున్శాంతిచ్చువిద్యమ్ము నా
కభయంబిచ్చుచువిజ్ఞతిమ్ము తిరమౌకార్యమ్ముచేయిస్తునా
యభవున్జేరగమార్గమిమ్ముగిరిజా యన్వర్థచింతామణీ॥ 75

మ॥ మనమందెప్పుడుమంచియోచనలచేమర్యాదగల్గించుయే
దినమందైనను నీదు పూజలలొయర్థింతేను భక్తిన్సదా
వినగన్యిమ్మికరమ్యగానమునునీవీణాధ్వనిన్ధన్యతనొం
దను! యాశీర్వచనమ్మునిమ్ముహిమజాధర్మజ్ఞ చింతామణీ॥ 76

మ॥ ప్రమధుల్సర్వగణాధినాధులలనీప్రాగ్ద్వారసేవల్తొవా
రమలైశ్వర్యవిభూతినొందిపరివారాటంకరాహిత్యులై
విమలానందవిశేషవిజ్ఞతలసద్విద్యావిలాసంబుచే
భ్రమలేకుండగకార్యనిర్వహణులౌభావించ చింతామణీ॥ 78

మ॥ సకలైశ్వర్యవిధాతవీవుమదినీసాంగత్యమిప్పించినా
వికటాలోచనలన్నిటిన్నణచినీవీక్షన్సదాలించి కా
ముకభావాగ్నినిచల్లబర్చిమరినామోహంబుబాపమ్మయో
సకలాధీశ్వరిశాంతరూపహిమజాసద్భక్త చింతామణీ॥ 79

మ॥ మహిలోనుండిననాల్గునాళ్ళుమదిలోమాయాబలంబెంతయో
యహిపాశంబయిబాధపెట్టుమరిమాయాతీతశక్తీవుయీ
యహితంబౌపథమెంతకాలమనినాయానంబుతల్లీకనన్
మహితాత్మామహిమాన్వితపథామంత్రార్థచింతామణీ॥ 80

మ॥ లలితాకల్పలతావితానకలితాలావణ్యభావాన్వితా
ఫలితా వాక్పలితాసదాసమరతాప్రావీణ్యభాషాన్వితా

జ్వలితాజ్ఞానరతాకథాశ్రవణచర్యావిజ్ఞతానందితా
చలితాకుండలి శక్తిదాయినిసతీ సద్భక్తచింతామణీ॥ 81

మ॥ మమతామానసమంజుభాషిణినమోమాణిక్యభూషాన్వితా
సమతాసత్పథగామినీసమరసాసారస్వతారూపిణీ
ప్రమతీప్రోక్తనపుణ్యకర్మఫలితాపాలాక్షతన్వర్ధినీ
సమయాచారసమర్థినీశివసతీ సద్భక్తచింతామణీ॥ 82

మ॥ కవితాగోష్ఠులకావ్యగానములనాకారంబుదాల్చీవుయా
కవికాంక్షల్గనికామితంబులనుసాకారంబుగావించునీ
యవినాభావపుబంధమున్కనగనానందమ్మొకల్గెంతయో
యవిముక్తమ్మగుభక్తినిమ్మనెదనోసద్భక్తచింతామణీ॥ 83

మ॥ మునునేజేసినసేవచేయిచటయామోహ-టవీమధ్యమున్
ఘనమౌజీవనమార్గమందుకనమోఘంబైనవిద్యిచ్చియే
పనులంద్దైననువిజ్ఞతన్కనెడినోప్రజ్ఞిచ్చిరక్షించితే
కననిన్మించినతల్లిలేదుకదనోకామ్యార్థచింతామణీ॥ 84

మ॥ హిమపుత్రై శివవామభాగమునూహించీవుయుత్సాహియై
యమలైశ్వర్యపథంబువీడిమునిరాట్సాంగత్యమున్గోరినీ
హిమరాట్వంశముకీర్తినొందగనుమాహేశానివైనిల్చితే
యమరాధీశనగాధిరాజనుతయోకామ్యార్థచింతామణీ॥ 85

మ॥ పరతంత్రాలనుభగ్నపర్చిపరకోపాగ్నాగ్నిచల్లార్చియా
ధరనున్నీసమయంబునందుపరమంత్రాలన్నికట్టేసినీ
పరమౌజ్ఞానమునిచ్చి వైరికుల దంబంబణ్చిమాకింకనీ
వరమీశ్రీకరమైనభక్తిమనమున్వర్ధిల్లచింతామణీ॥ 86

మ॥  కననీమానవజన్మమందుననెయీమానంపుదంబంబులున్
మనమున్నేననుగర్వపోకడలుయేమార్పుల్సదామోహమున్
ధనమేశాశ్వతమన్చుతల్చెదరుయోదారిద్ర్యభావంబుచే
వినవేతల్లికనాదువిన్నపమునీవీక్షించిచింతామణీ॥ 87

మ॥  మదినీనామముతల్తునెప్పుడునునీమాయల్యికన్జాలు నీ
హృదినామార్గముచింతజేయుదనినూహింతున్సదామాన్యత
న్సదనంబీయికగౌరవాభ్యుదయవాసంబయ్యివర్ధిల్లగ
న్సదయాహ్లా-దవిహ-రభూమికయియోసద్భక్తచింతామణీ॥ 88

మ॥  అరిషడ్వర్గపుపోరడంగునుమనంబందున్సదానీదరిన్
పరులెవ్వారునుకాంచలేరుయిదినాభావాబ్జమధ్యస్థలిన్
తిరమౌనీపదపంకజంద్వయముకాంతిన్జిమ్మచిత్రమ్మయో
గిరిజాగీష్పతిసేవలందెడిసతీగీర్వాణచింతామణీ॥ 89

మ॥  జననంబేయుదయంబునస్తమయమే ఙావన్దునీమార్గమున్
దినయామ్యంబులజీవులీవిధినసందేశాత్మకంబైనజీ
వనయానంబునకాలమున్గడుపుచున్వ్యామోహబద్ధుల్యయీ
మనమున్తల్వరుశాంతిధర్మములనోమంత్రార్ధచింతామణీ 90

మ॥ మదినీయందముకాంచివర్ణనలనీమంబుడ్గునంచెంచియే
నదిచేజాలకనుంటినమ్మపరమానందమ్ముకల్గించునీ
పదసేవల్యికకల్గజేయుముమ సౌభాగ్యంబువర్ధిల్లగన్
సదయాహ్లా-దవిశేషవిజ్ఞతలనీ సద్భక్తచింతామణీ ॥ 91

మ॥  కరుణాంభోనిధివీవునీసుతునివాక్కృక్తిచ్చిరక్షించవే

పరులెవ్వారునుమాటలాడకనునాభావాబ్జజాలంబునన్
పరిపుష్టిన్గలసంపదిమ్ము గిరిజాభాస్వత్ప్రభాభారతీ
సరిజోడెవ్వరునీకులేరెచటనోసద్భక్తచింతామణీ॥ 92

మ॥ స్థిరబుద్ధిమ్మనివేడుకొంటిననుయాశీర్వాదమిమ్మీశ్వరీ
యరిసంఘంబులవాక్కుకట్టుచునుమాయల్ద్రేల్చిరక్షించుచున్
పరివారమ్ములయోగభోగములసౌభాగ్యమ్ముకల్గించుచున్
సరియౌవారినిజేర్చిరక్షనిడుమోసద్భక్తచింతామణీ॥ 93

మ॥ విలసత్కాంచనకాంతిరేఖయయియావేశాద్భుతజ్ఞానమై
కలలోకాంచినరీతినాయెదుటసాకారమ్ముదాల్చీవుయీ
యిలలోయుండెడికొన్నినాళ్ళయినహ-యిన్గూర్చిమాటాడుమా
యలనీభక్తులకావగాసతతమున్సద్భక్తచింతామణీ॥ 94

మ॥ మదినీరూపముకాంచనిమ్ముసతతమున్మాహేశ్వరీధీనిధీ
హృదయాహ్లాదవిహ-రవిశేషవిధినూహింపంగశక్తిచ్చినీ
పదమందారములందుబుద్ధినిలుపన్ప్రజ్ఞిమ్ముకాంతిమ్మునీ
దుదయాసారరసాంబువుల్తడిసెడిన్తుష్టిమ్ము చింతామణీ॥ 95

మ॥ కలకాష్టాదులకాలరూపిణివియేకాకారపుష్టీవు వి
ద్యలమూలాంశమునీవయైసకలసాధ్యాసాధ్యశక్తీవునై
యలధర్మాచరణంపుబుద్ధికలిగించుజ్ఞానమైనడ్పగన్
జలమందున్భువియున్పరింతువుసదాసద్భక్తచింతామణీ॥ 96

మ॥ మనమందున్నినుదల్తునెప్పుడుసదామాక్షేమమున్గోరుచున్
ధనమిచ్చీవిలధర్మసాధనకున్ మార్గమ్ముచూపమ్మనా
మనుమల్రక్షణనీదుభారమగునోమాహేశ్వరీధీమయీ

చననీమార్గమునందునడ్పుముసదాసద్భక్తచింతామణీ॥ 97

మ॥ మధురంబైనదినీకథాలహరికామాక్షీసదాహృద్యమై
నిధియౌభక్తులపాలి కల్పలతికా నీలాలకా సుస్మితా
బధిరాంధుల్మదితల్పరక్షనిడికాపాడెప్డు దీవించుమా
మధురాంభోనిధిపుత్రికా సమరసా మంత్రార్ధచింతామణీ॥ 98

మ॥ గురురూపంబునశిష్యసంతతికిమార్గోపాయమున్జూపుచున్
తెరువైధర్మమునాచరించనరులందెల్లప్డునాచార్యగా
దరిచేరెప్పుడుకేలుబట్టినడవన్దారిన్సదాచూపుదే
సరియౌవారలులేరునీయెదుటనోసద్భక్తచింతామణీ॥ 99

మ॥ ధనమిమ్మంటినిధర్మసాధనకుబాధల్లేకవర్తిల్లగా
మననిమ్మంటినికార్యసాధనునిగామాటాడుటందున్సదా
విననిమ్మంటినిసత్కథావిషయముల్వీనుల్సదాహర్షతన్
చననిమ్మంటినిభక్తిమార్గమునవోసద్భక్తచింతామణీ॥ 100

ఇది
కౌండిన్యసగోత్రోద్భవుండగు ములుగునాగలింగారాధ్య ప్రపౌత్రుండును
విశ్వనాధారాధ్య పౌత్రుండునుదుర్గాప్రసాదారాధ్యపుత్రుండును
హనుమకొండ వాస్తవ్యుండును యగు ములుగు విశ్వనాథారాధ్య విరచిత
చింతామణీ నామ మకుట సహితశత పద్య సుమంబులు
శ్రీలలితాత్రిపురసుందరీదేవిచరణారవిందములకు సమర్పితము
ఇతిశం